# మొక్కుబడి

శ్రీ జంపన ఎం. ఏ., బి. ఇడి.,
లెక్చరర్: ఏలూరు కాలేజి.



పసుపులేటి బాపిరాజు,
శ్రీ సత్యనారాయణా పబ్లిషింగ్ హౌస్
రాజమండ్రి
1940



మానవజీవితంలో మధురఘట్టం వివాహం. వివాహాన్ని రసవత్తరంచేసేది సతీపతుల ప్రేమజీవితం.

భారతదేశంలో భార్యలఅడుగులకు మడుగులొత్తే భర్తలు నూటికితొంభైమంది. భార్యలను ప్రేమించి గౌరవించే వారు నూటికి అయిదుగురు. భార్యలనుఉపాసకులై ప్రేమించి ఆరాధించేవారు మిగిలిన అయిదుగురు.

పదిమందినీపొగిడి బ్రతికే బానిసలు భార్యలనుకూడా పొగడడం ప్రారంభించి, కేవలం దాసానుదాసు లౌతున్నారు. ఇటువంటిపురుగులే ప్రతియింటా కులకులలాడుతున్నారు.

పగలుపగలల్లా పాటుపడి మగవాడు కాంక్షించేది తన భార్యపెదవులపై చిరునవ్వు వెలుగు... పగలుపగలల్లా పాటుపడి స్త్రీవాంఛించేది గృహభర్త నెత్తుటిబిందువులనుండి తయారు చేయబడిన కాసులపేరు... ఇదిసహజప్రవృత్తి. దీనికి భిన్నులు, అతీతులు లేరనికాదు. కాని వారిసంఖ్య బహుస్వల్పం.

రామచంద్రునిది నిండుమనస్సు; పండినబుద్ధి, నవ్వుతప్ప కోపం ఎరుగని ప్రశాంతహృదయం. స్నేహాంకోరకు అగళ్లులు చాస్తాడు; స్నేహితులంటే మిన్నులుముడతాడు.

అతడు తనకితాను ప్రేమమయుడు. పూలనుకూడా కోయలేని పుణ్యమూర్తి. నడిరాత్రిలకాంతిమారి పొంగిపోయే సరసుడు.

జీవితాన్ని ఒక ఆనందమందిరం చేయాలని కాంక్షించే భక్తుడు. బ్రతుకు బ్రతుకంతా ఒక వెన్నెల రేఖ క్రింద వికసింప చేయాలని భావించే యోగి. ప్రత్యణువులోనూ ప్రకృతిసౌందర్యాన్ని చూడాలని వాంఛించే జ్ఞాని.

భార్యఅంటే అతనికి పంచప్రాణాలు. "నిర్మల" అనే పేరువింటేచాలు, అతని ప్రతిరక్తకణంలోనూ ఒక తీయని రాగాలాపన వినబడుతుంది.

రామచంద్రుని వయసు 30 సంవత్సరాలు.

నిర్మల వయసు 20 సంవత్సరాలు. అతడు ఆఫీసుకు వెళ్ళి సాయంకాలం ఇంటికి బయలుదేరాడు. ఆరోజు నెల జీతం' అందుకొన్నాడు. ఒకటవతారీకునాడు ఉద్యోగస్తులకు ముక్తిమందిరద్వారాలు తెరచినట్లుంటుంది. ఆరోజు వాడిపోయిన మూడు పెదాలపై వేడి వేడి నవ్వులు వెలుగు వెల్లలు వేస్తాయ్.

సాధారణంగా సామాన్యఉద్యోగి ప్రతివానికి 'నెలజీతం' అందుకొన్న మొదటిరోజు 'గోల్డెన్ డే' (Golden day)—

రెండోరోజు 'సిల్వర్ డే' (Silver day)-

మూడోరోజు 'కాపర్ డే' (Coper day)-

నాలుగోరోజు 'పాపర్ డే', (Poper day)-

అయిదోరోజు 'బెగ్గర్ డే' (Begger day)...

ఇలా గుంటుంది వానిబ్రతుకు తెరవువిధానం.

రామచంద్రుడు రసికుడని చెప్పాను కదూ! మొదటి తారీకు జీతం అందుకొని బజారు వెళ్ళి నాలుగు వేల మల్లెపూలు రెండురూపాయల మిఠాయ్, పదిరూపాయలు పెట్టి పవడరు స్నో ఇత్యాదులు తీసుకొని 'ఇవన్నీచూచి మానిర్మల ఎంత ఆనందిస్తుందో! నన్నెంతగా గారవిస్తుందో' అనుకుంటూ బయలుదేరాడు ఇంటికి

ఇల్లు చేరాడు.

ఇంటితలుపులు వేసిఉన్నాయ్. తాళంవేసుకొని తన నిర్మల ఎక్కడకు వెళ్ళిందో తెలీదు. ఆచీకటిలో అలాగే అరుగుమీద కూర్చున్నాడు.

విరబూసిన మల్లెపొదలా చంద్రుడు తనచల్లని వెన్నెలను కళ్ళనిండా నింపివేస్తున్నాడు. ప్రియురాలికై తెచ్చినమల్లె పూలపై నవ్వులను ఆరబోసుకొంటు చంద్రుడ్ని చూస్తూంటే, రామచంద్రుని హృదయం పడగిప్పి ఆడుతూంది.

'నిర్మల ఎక్కడకు వెళ్ళినట్లు?' దానికేమీ జవాబు రాలేదు.

రాత్రి ఎనిమిది గంటలయింది. నిర్మల రాలేదు. అతని ఆశ నిరాశాగర్భంలో అంతర్లీనం అయి పోతూంది, కడుపులో ఆకలి; కళ్ళల్లో తెల్లని చల్లని వెన్నెల రేఖల వితానం.

ఒక ఆకు రాలినా, పూరేకు జారినా, తన నిర్మల వస్తుందని చూచేవాడు. పక్షి తన రెక్కలు రెపరెపాకొట్టుకుంటే

చాలు, తననిర్మల కాలిచప్పుడని లేచిచూచేవాడు. సంతో
గాన్ని ఎదురుచూచే వియోగంలో ఎంతమాధుర్యం ఉందో!
క్షణక్షణ నిరీక్షణ నిరీక్షణలో కలతచెందని హృదయానికి ఆనంద
రసోద్రేకం ఎలాకలుగుతుంది? అనుభవజ్ఞులకు కాని అర్థంకాని
విషయాలివి.

రామచంద్రుడలాగే గోడకుజేరబడి ప్రకృతి సౌంద
ర్యాన్ని చూస్తూ కూర్చున్నాడు.

రాత్రి 9 గంటలు దాటింది.

అతని ఇంటిసమీపంలో నవ్వులు వినబడ్డాయ్. ఉలుక్కు
పడిలేచి కూర్చున్నాడు. గొంతుకు ఆనమాలు కట్టాడు.

ఎవరివా నవ్వులు?

ఇంకెవరివి? తన నిర్మలవే—నిర్మలతో ఉన్న మరో ఇద్దరి
వ్యక్తులవి.

'నిర్మలా! మీఆయన నీకోసం ఎదురుచూస్తూ ఉంటా
డనుకుంటా—'

'ఎదురుచూడ్డం ఎందుకు? మాపక్కింటి నాంచార
మ్మకు తాళంఇచ్చి వెళ్ళాంగా. తాళంతీసుకొని, తలుపులు
తెరచి లోపలకువెళ్ళి హాయిగా వడ్డించుకొని భోంచెయ్యొ
చ్చునుగా...'

'తాళంసంగతి తెలుసా?'

'తెలుసుకోవాలి.'

ఈమాటలన్నీ విని లేచి నిలబడ్డాడు రామచంద్రుడు.

నిర్మల తనపక్కింటి కామాక్షమ్మ కామాక్షమ్మ భర్త శ్రీధరంతోటే సినిమా చూచి, ఇల్లుచేరింది. వారు వారింటికి వెళ్ళిపోయారు. నిర్మల తనఇంటికి వచ్చింది.

'ఇదేమిటి? ఇలాబయట నిలబడ్డారే?'

'లోపల నిలబడ్డానికి వీలులేదు కాబట్టి.'

'ఏం? తాళం తీసుకోలేరూ?'

'లేదు.'

'ఏం?''

"నీవా పక్కింటి అమ్మకిచ్చావని నేను కలకనలేదు కాబట్టి."

'మంచిపని చేశారు.'

ఆమె విసుక్కుంటూ పక్కింటికివెళ్ళి తాళంతీసుకొచ్చి తలుపులు తెరిచి లైటు వెలిగించింది.

'ఎంతవెలుగు!'

"ఏమనుకున్నారు?''

'పతిలేని పతిజీవితం చీకటిమయం'—అని, 'పతిగలపతి జీవనం వెలుగుమయం'—అని గ్రహించాను.

'ఊహూఁ'

'నీవు లేకపోతే చూడూ చీకటిలోఉన్నాను. నీవురాగానే ఇల్లంతా వెలుగుతో నిండిపోయింది. గృహానికి లక్ష్మివి, అందు

చాలు, తననిర్మల కాలిచప్పుడని లేచిచూచేవాడు. సంయోగాన్ని ఎదురుచూచే వియోగంలో ఎంతమాధుర్యం ఉందో! క్షణక్షణ నిరీక్షణ నిరీక్షణలో కలతచెందని హృదయానికి ఆనంద రసోద్రేకం ఎలాకలుగుతుంది? అనుభవజ్ఞులకు కాని అర్థంకాని విషయాలివి.

రామచంద్రుడలాగే గోడకుజేరబడి ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ కూర్చున్నాడు.

రాత్రి 9 గంటలు దాటింది.

అతని ఇంటిసమీపంలో నవ్వులు వినబడ్డాయ్. ఉలుక్కుపడిలేచి కూర్చున్నాడు. గొంతుకు ఆనమాలు కట్టాడు.

ఎవరివా నవ్వులు?

ఇంకెవరివి? తన నిర్మలవే—నిర్మలతో ఉన్న మరో ఇద్దరి వ్యక్తులవి.

'నిర్మలా! మీఆయన నీకోసం ఎదురుచూస్తూ ఉంటాడనుకుంటా—'

'ఎదురుచూడ్డం ఎందుకు? మాపక్కింటి నాంచారమ్మకు తాళంఇచ్చి వెళ్ళాంగా. తాళంతీసుకొని, తలుపులు తెరచి లోపలకువెళ్ళి హాయిగా వడ్డించుకొని భోంచెయ్యొచ్చునుగా...'

'తాళంసంగతి తెలుసా?'

'తెలుసుకోవాలి.'

ఈమాటలన్నీ విని లేచి నిలబడ్డాడు రామచంద్రుడు.

నిర్మల తనపక్కింటి కామాక్షమ్మ కామాక్షమ్మ భర్త శ్రీధరంతోటే సినిమా చూచి, ఇల్లుచేరింది. వారు వారింటికి వెళ్ళిపోయారు. నిర్మల తనఇంటికి వచ్చింది.

'ఇదేమిటి? ఇలాబయట నిలబడ్డారే?'

'లోపల నిలబడ్డానికి వీలులేదు కాబట్టి.'

'ఏం? తాళం తీసుకోలేమూ?'

'లేదు.'

'ఏం?''

"నీవా పక్కింటి అమ్మకిచ్చావని నేను కలుసనలేదు కాబట్టి.''

'మంచిపని చేశారు.'

ఆమె విసుక్కుంటూ పక్కింటికివెళ్ళి తాళంతీసుకొచ్చి తలుపులు తెరిచి లైటు వెలిగించింది.

'ఎంతవెలుగు!'

"మరేమనుకున్నారు?''

'సతిలేని పతిజీవితం చీకటిమయం'—అని, 'సతిగలపతి జీవనం వెలుగుమయం'—అని గ్రహించాను.

'ఊహూ'

'నీవు లేకపోతే చూడూ చీకటిలోఉన్నాను. నీవురాగానే ఇల్లంతా వెలుగుతో నిండిపోయింది. గృహానికి లక్ష్మివి, అందు

చేతే గృహలక్ష్మివయ్యావ్. నాభాగ్యాన్ని వర్తిసాదించే లక్ష్మివి; అందుచేతే భాగ్యలక్ష్మి వయ్యావ్.'

'చాల్లెండి! ఈనయగారాలు.'

'నిర్మలా! ఈపూలన్నీ నీకోరకు కన్నులువిప్పి ఎలా చూస్తున్నాయో చూడు.'

'ఇంకా ఏం తెచ్చారు?'

'ఇవిగో—మిఠాయిలు; పకడర్లు; సోన్లు!'

'పోయింది; మతిపూర్తిగా పోయిందన్నమాట '

'ఏం?'

'ఇవన్నీ ఎందుకు?'

'నీకే.'

"ఏమైనా సంసారులు అనుకున్నారా? గుండాగోయ్యాలం అనుకున్నారా? ఎన్నిరూపాయిలు తగలేశారూ?"

"తగలెయ్యలేదు; 15 రూపాయిలు కర్చుపెట్టా."

"చాల్లెండి. నెలజీతంఅంతా ఇలాఖర్చుపెడితే నెలంతా ఎలాగడుస్తుందనుకున్నారు."

"నిర్మలా! పిల్లా? జల్లా? ఎవరున్నారని భయం."

"ఇప్పుడు లేకపోవచ్చు. ముందు పిల్లాపాపా కలగరని ఎక్కడుంది? ఇలా కర్చుచేస్తే పుట్టేవాళ్ళకెలా?'

'ఇది బాగుంది. రాబోయే చీకటిని తలుసుకొని, ఉన్నా వెన్నెలను పాడుచేసుకొన్నట్లు, పుట్టబోయే పిల్లలకెలా అని ఇప్పటినుంచీ బాధపడతామా? పద పద, సుఖంగాభోంచేద్దాం'

'నేను కామాక్షిగారింటిలో భోంచేసి, వారు పట్టు పడితే సినిమాకు వెళ్ళివచ్చా."

"నాతో చెబితే నేనూ వచ్చేవాణ్ణికదూ!'

'ఏమో? అపుడు తట్టలేదు.'

'సరేలే—'

ఆమె వంటింటిలోకివెళ్ళి భర్తకు భోజనం వడ్డించింది. అతడు తింటున్నాడు.

'శ్రీధరం ఎంతమంచివా డనుకున్నారు?"

"ఎంత మంచివాడు?"

"చెప్పలేనులెండి. స్త్రీ పురుష సమత్వంకావాలని, దేశ స్వాతంత్రంరావాలని ఎంతచక్కగా మాట్లాడాడనుకున్నారు?"

"చదువుకున్నాడేమో, చక్కగా మాట్లాడగలడు.'

'మహాత్ముడు లెండి.'

'అమాయకు లలాగే అనుకుంటారు.'

'మహాత్ముడు కాదంటారా?'

'ఎలాగౌతాడు? మనసూ, మాటా, చేతా ఒకటికాని అతడు మహాత్ముడెలాగౌతాడు.'

'అతడుకాడు; మీరే మహాత్ములులెండి.'

"నిర్మలా! కోపం ఎందుకు?"

'మంచివాణ్ణి మంచివాడని ఒప్పుకోపోతే కోపం రాదూ?'

'నీకు మంచివాడు కావచ్చు; నాకుకాదు. అంత మాత్రంలో నీకు కోపం ఎందుకు? నిర్మలా! ఒకరిభావం మరొకరికి నచ్చకపోవచ్చు. దానికి కోపం ఎందుకు?'

'సరేలే భోంచెయ్యండి.'

'అబ్బా! అలా విసుగ్గోకు నిర్మలా! నీకనుబొమలు ముడి పడితే నేను చూడలేను... ఈ పూలన్నీ నీచిరునవ్వు పొంద డానికి తెచ్చినవే కాని, నీహృదయం మండించడానికి తెచ్చి నవికావు.'

"సరేలే. చెయికడుక్కొని, గదిలోకిపదండి. వస్తున్నా"

"మంచిది."

రామచంద్రునకు భార్యాప్రవర్తనం కష్టంకలిగించక పోలేదు. కాని విజ్ఞాని కాబట్టి ఆమెహృదయానుగుణంగా ప్రవర్తించగలిగాడు.

ఏభర్తైనా యౌవనంలోఉన్న మరో స్త్రీ అందచందాల గురించి పొగిడినా, మంచిగురించి నుతించినా అతనిభార్య బాధపడకపోదు.

అలాగే ఏభార్యఅయినా పరపురుషుని అందచందాల గురించి, మంచిగురించి నుతిస్తే తనభర్త బాధపడకపోడు.

ఇది సామాన్యుల విషయం...

ఆమె గదిలోకివచ్చి భర్తకు తమలపాకులిస్తూ 'శ్రీధరం! పూర్వంకంటే యుద్ధంలోకివెళ్ళి వచ్చింతరువాత బలిసి, ఎంత

అందంగా తయారయ్యా డనుకున్నారు'' అని అతగాడివర్ణన ప్రారంభించింది.

'యుద్ధంలో చెడమేస్తే అలాగే ఉంటారు లే'అని అతడు విసుగుదలతో చెప్పినా గ్రహించక వర్ణనఆపలేదు.

రామచంద్రునకు చాలకోపంవచ్చింది.

"నిర్మలా! ఆతనివర్ణన దయచేసి ఆపగలవా?"

"ఆపానులెండి.''

"ఆవెన్నెట్లో పరుపుపై తెల్లని సిల్కుదుప్పటి వేసుకొని, ఈనాలుగువేల పిడేన మల్లెపూలు విరియజల్లి పండుకుందామా?''

చాల్లే ఊరుకోండి.'

'ఏం?'

'జలుబుచేయదూ?'

వేసవికాలం జలుబేమిటి?'

'మానాన్న వద్దన్నాడు. వెన్నెట్లోపండుకుంటే పక్షవాతం వస్తుందంట.'

'అదిరోజూ పండుకుంటే, అప్పుడప్పుడు పండుకుంటే భయంలేదు.'

'మీకు కావాలంటే పండుకోండి. నేనురాను.'

నీకు చీకటంటే ఇష్టం; నాకు వెన్నెలంటే ఇష్టం. ఈరెండూ ఒకచోట ఎలాకలిసి ఉంటాయ్.'

'ఉండవుకాబట్టే మీరువెళ్ళి పండుకోండి.'

'నాకు జబ్బువస్తే నీకుకాదూ?'

'నాకే; మీకు జబ్బువస్తె మీరేబాధపడతారు.'

"నీవు కాదన్నమాట."

'ఎందుకవుతా'

అతడు మాట్లాడకుండా మేడగదిముందు కాళీస్థలంలో పండుకున్నాడు. ఆమె తనచీకటిగదిలో మంచంమీద పండుకుంది.

ఆతడెంత సంతోషంతో ఇంటికివచ్చాడో, అంతవిచారంతో బయట పండుకున్నాడు. ఆమెను తనమార్గంలోనికి ఎంతగా తిప్పుకుందామని ప్రయత్నంచేశాడో, అంతగాఆమెకు వేరయ్యాడు—ఏమిటో పాపం!

---

## ౨

భార్యాభర్తలు మంచివారే కావచ్చు; దేశోద్ధారకులే కావచ్చు; మతోద్ధారకులే కావచ్చు; అంతమాత్రాన ప్రేమీ ప్రేమికులు కాలేరు.

ప్రేమకు ప్రధానం పవిత్రహృదయం— అంతేకాదు సతీపతులొకే బంధాలో తమజీవితాలను నడపాలి. మనః ప్రవృ

త్తులు కలియాలి. మార్గాలు వేరైతే మనసులు వేరౌతాయ్. మనసులు వేరైతే ప్రేమాంకురం రాతిమీద వేసినట్లు, ఫలవంతం కాలేదు.

రామచంద్రుడు పవిత్రుడే. నిర్మల సుగుణవతే. కాని వారిమార్గాలు వేరయ్యాయ్. దానితో వారిమనసులకు లంరంగదడంలేదు. భర్త భార్యకు అనుగుణంగా నడవాలని ప్రయత్నిస్తున్నాడు. భార్య భర్తకు అనుకూలంగా నడవాలని ప్రయత్నిస్తూంది. కాని ఒకరి భావాలు మరొకరికి సంబంధం లేకపోవడంచే, వారిమార్గాలువేరై మనసులు నీరౌతున్నాయ్.

భర్త బి. ఏ. ప్యాసయ్యాడు. చాలాగ్రంథాలు చదువుకున్నాడు. నవనాగరిక పద్ధతులకతని బుద్ధిని జలకలువుకుంటున్నాడు.

భార్య చదివిందికొద్ది పూర్వాచారపద్ధతులంటే ఆమెకు ప్రాణం.

ఒకరిది కొత్తప్రపంచం; మరొకరిది పాతప్రపంచం. భర్త పొరపాటుచేస్తున్నాడని భార్య బాధపడుతూంది. భార్య పొరపాటుచేస్తూందని భర్త బాధపడుతూన్నాడు.

ఎవరుపొరపడుతున్నారో పఠితృలోకంలో ఎవరికివారే ఊహించుకోవాలి.

* * *

నిర్మల జబ్బుపడింది.

నలుగురు అమ్మలక్కల ప్రోత్సాహంవల్ల తన తలను మొక్కుకుంది ఏడుకొండల వెంకటేశునకు. భర్తరామచంద్రం డాక్టర్ను తీసుకొని ఇల్లుజేరాడు.

'ఇంకనాకు మందు లవసరంలేదండీ!'

'ఏం?'

'జబ్బు నయం అయిపోతుంది.'

'ఎలా?'

'తిరపతి వెంకటేశ్వరులకు మొక్కుకున్నా.'

'అయితే.'

'జబ్బుపోతుంది.'

"మొక్కులకే జబ్బులుపోతే, ఈడాక్టర్లందరూ ఎందుకు? ఈమందు మాకు లెందుకు? ఈచరక సుస్రుతుల వైద్యగ్రంథా లెందుకు? ఈహాస్పత్రు లెందుకు?"

'అన్నీ అనవసరమే.'

'జ్వరంవస్తే మందు తీసుకోవాలికాని, తులసితీర్థంఇస్తే తగ్గుతుందా?'

'తప్పక.'

'గంగానదిలో మునిగితే...'

'పూర్తిగాపోతుంది. నమ్మకం ఉండాలిగాని భగవంతుడు చేయలేనిదేముంది?'

'ఇంతకూ డాక్టరుగారు అవసరం లేదంటావ్.'

'తప్పక.'

రామచంద్రుడు మాట్లాడకుండా డాక్టర్ని పంపించేశాడు.

*　　　*　　　*

అమావాస్య.

తెల్లవారుఝామున నాలుగు గంటలయింది. నిర్మల భర్తను తట్టిలేపింది. అతడు లేచి కూర్చున్నాడు.

'ఏం నిర్మలా?'

'కనబడ్డాడు. కనబడ్డాడు.'

'ఎవరు?'

"తిరుపతి వెంకటేశ్వరులే."

'ఎక్కడ?'

'కలలో—నా తలంతా కోరి తీసుకున్నాడు.'

'పగలు పగలంతా కలవరిస్తూ వుండుకున్నావేమో, అదే కలలోకి వచ్చింది. తీరని కోరికలన్నీ ఇలా కలలద్వారా తీరతాయి.'

"ఎన్ని యదార్థాలు కలల్లోకి రావడంలేదూ!'

'ఏదో లక్షకో కోటికో ఒకటి గురిలేక రాయివిసిరినా ఒకపండు పడొచ్చు. అంతమాత్రంలో గురికుదిరింది అనుకో రాదు.'

'చాల్లెద్దురూ! మీదంతా ఎదురుమతం. అందరూ అవునంటే, మీరు కాదంటారు. ఎలాపడుస్తుంది?'

'నిర్మలా! మన బుద్ధివికాసంబట్టి మనభావాలు మన భావాలశక్తి ననుసరించే మనకు 'సత్యస్వరూపం' ప్రత్యక్షం అవుతుంది... ...నీకు వెంకటేశ్వరులు దైవం. నాకు కేవలం మనిషి చెక్కిన రాతిబొమ్మ.'

"ఊరుకోండి నాలుక రాలి పడిపోగలదు.'

'సత్యంపైవేసిన ముసుగుతీసి లోకానికి చూపితే నాలుకఊడిపోతే నేను దానికిభయపడను; నిర్మలా! వెంకటేశ్వరులే దేముడైతే; రాముడెవరు? కృష్ణుడెవరు? జగన్నాథుడెవరు? శివుడెవరు?... ... ...'

'వాళ్ళంతా దేవుళ్ళే.'

'వాళ్ళను పాలించే దెవరు?'

'మరో దేముడు?'

'ఎంతమంది దేముళ్ళేమిటి?'

'ఏమో!'

'నిర్మలా! సృష్టినిపాలించి, పోషించి, రక్షించేది తేజోస్వరూపుడైన దేముడొక్కడే. ఇందరులేరు. వీరంతామానవులు కల్పించి, నిర్మించిన దేవుళ్ళు. ఆయనసృష్టినే నిర్మించి, పాలించే తేజస్వరూపుడు.'

'ఆయనను పూజించడం ఎలా?'

'ఆయన సృష్టిని ప్రేమించడమే ఆయనను పూజించడం ఆయనసృష్టిలోని ప్రతివ్యక్తినీ ద్వేషిస్తూ ఆయనను పూజించడానికి పూనుకుంటంలో అర్థంలేదు.'

'మీమాటలన్నీ వింతగా ఉంటాయండీ'

"అవునవును... ..."

'వెళ్ళి పండుకోండి."

'అలాగే.'

రామచంద్రుడు బరువుగుండెతో వెళ్ళి పండుకున్నాడు. ఆమె ఆలాగే ఆలోచనల్లోపడింది. ఇద్దరూ నిదరపోలేదు.

నాలుగురోజులయింది. చేసిన కటికిపత్యాలవల్లో, వెంకటేశునిపై నమ్మకంచేతో, మనోకారణంచేతో ఆమె జ్వరం తగ్గింది. ఆరోగ్యం కుదుటపడింది.

కొన్నాళ్ళు గడిచాయ్.

తలారా స్నానంచేసి, విరజాజిపూలు తలలోపెట్టుకొని, నవ్యమోహన శృంగార రసాధి దేవతలా తయారయింది నిర్మల.

ఆసాయంకాలం ఇంటికివచ్చినభర్త ఆమె సౌందర్యం చూచి రసతన్మయుడై పొంగిపోయాడు.

ఎంతో అనురాగంతో 'నిర్మలా!' అని పిలిచి, ఆమె నంకీ వంకీల పెద్ద మెత్తనితల అరచేతుల గాలాబంగాదిద్దాడు.

'నన్నెప్పుడు పంపడం?'

"ఎక్కడకు?"

'తిరుపతి కొండకు.'

'ఎందుకు?"

'ఈతల వెంకటేశ్వరునికి ఇచ్చివేయడానికి.'

"తలా?"

"తలే..."

"తలా!'

'ఎందుకా ఆశ్చర్యం!'

అతనినోట మాట రా లేదు.

'ఎందుకండీ అలా బిక్కమొఖం వేశారూ?'

'నిర్మలా! నల్లగా వంకీవంకీలు తిరిగి నెమలిపింఛంలా అతిమనోజ్ఞంగాఉన్న ఈతలను తీసివేసేవానికంటే నా ప్రాణాలే తీసివేయరాదూ?'

'తీసివేయడం లేదండీ, దేమునికిస్తున్నా.'

'పనికిరాని తలవెంట్రుకలు, గోఖ్యా, ఇచ్చేదానికంటే, పరమపవిత్రమైన హృదయాన్ని ఈయరాదూ?'

'హృదయంతోటే తలనిస్తున్నాం. తలకంటే స్త్రీ పురుషులకు అందమైనది లేదు. అందుచే అన్నిటికంటే అందమైన తల నిచ్చి వైరాగ్యం చెందుతున్నాం భక్తులం అవుతున్నాం.'

'భగవానుడిచ్చిన సౌందర్యాన్ని పాడుచేస్తేతప్ప వైరాగ్యం అబ్బదా!''

'పాడేముందండి... పాతాకులు డొలిచి పస్తేగాని, కొత్త కొత్త చిగుళ్ళురావు! పాతతలపోతేగాని పట్టుకుచ్చువంటి కొత్త తల తుమ్మెదరెక్కల్లాగ నిగనిగ లాడుతూరాదు. అయినా భగవంతునికి అప్పస్తానన్నతల భగవంతునకు అర్పించకపోతే అసత్యదోషం రాదూ?'

"భగవానునిసృష్టి భగవానునకే అర్పించడంలో గొప్పతనం ఏముంది?''

'ఏమీలేదు. ఆయనసృష్టికిమించి ఏదీలేదుకాబట్టి, ఆయనసృష్టిలోని సౌందర్యంతప్ప ఆయనకు అర్పించగలిగేది మరొకటేమీ లేదు.

'అయినా నిర్మలా! వేమనయోగిఅన్నట్లు 'తలలు బోడులైన తలపులు బోడులా?' కావలసింది కోరికలులేని నిర్మల హృదయం. హృదయ సరస్సులోని నిరాశాతరంగాలు శాంతించాలంటే, ఆశావాయువు వీవరాదు. ఆశఅనేగాలి ఆగిపోతే, నిరాశఅనే తరంగాలు నిలిచిపోతాయ్. అపుడాహృదయం అనే సరస్సు అతినిర్మలంగా అద్దంలాగుంటుంది. దానిలో తేజోస్వరూపుడైన భగవానుడు కనబడతాడు. వానిని చూడాలంటే ఆశను కోసివేయాలి; కాని—తలగొరిగితే లాభంలేదు.'

'పూర్వం తలలిచ్చిన పెద్దలందరూ బుద్ధిహీనులే అంటారా?'

'తప్పక'

'అంతా బుద్ధిహీనులైతే మీరొక్కరే జ్ఞానులన్నమాట.'

'ఇవి నామాటలు కావు నిర్మలా. మహాత్ముల మాటలే నీకు చెప్పుతున్నా. మంచి చెడ్డలు చెప్పేవారు వారు. వారి ఛాయల్లో బ్రతికేవాడిని నేను.'

"మీదంతా మొండివాదన... వెధ్రాపిన్నా, న్యాయం అన్యాయం, దేవుడూ దెయ్యం — ఏమీ లెక్కచేయరు. కేవలం మూర్ఖపట్టు—'

'నిర్మలా. నన్ను అర్థంచేసికోలేక నిందించడంవల్ల నీకు వచ్చేదేమీ లేదు. నాదిమూర్ఖపుపట్టు కావచ్చు. నేనుమూర్ఖుడ్నే కావచ్చు. నా మూర్ఖంవల్ల నాశనమయ్యేది నేనే కాని నీవు కాదు కదా! నీకెందుకింత కోపం... నీయిష్టంవచ్చినట్లు నీవు చెయ్. బ్రతిమాలాను కాని బలవంతం చెయ్యలేదు. ఎవరికర్మ కెవరు కర్తలు?" అంటూ రామచంద్రుడు గంభీరుడై వెళ్ళిపోతూ ఉన్నాడు.

'అయితే నాతో తిరపతి రారా!'

'ఎన్నడూ రాను; రాలేను. నీతలపట్టుకొని మంగలివాని కత్తితో గొరిగించలేను. అందవికారంగా ఉండే నీముఖం చూడలేను...'

అతడుచాలా సుఖంతో అక్కడుంటే భార్యా నింకా కష్టపెట్టవలసివస్తుందని బయటకు వెళ్ళిపోయాడు.

ఆమె లోపలకు పనిచూచుకుంటానికి వెళ్ళిపోయింది.

*　　　*　　　*

పదిహేనురోజులు గడిచాయ్.

పెళ్ళి నిశ్చితం అందుకొని సాయంకాలం ఉషారుగా ఇంటికివెళ్ళాడు రామచంద్రం. అంతలో వెంకటమ్మ ఇంటి తాళం చేతికిచ్చింది. చేతిలోపుస్తకాలు అనుకోకుండానే నేలపై జారిపోయాయ్. అతనిహృదయంలో ఎన్నోకొండలు పిండిఅయి పోతున్నాయ్.

అతడు తాళంతీసి లోపలకు వెళ్ళేసరికి టేబుల్‌మీద ఒకఉత్తరం కనబడింది. అదిచూచాడు. దానిలో ఇలాగుంది.

'బావయ్యా'

మా అక్కయ్య ఉత్తరంవ్రాయగా వచ్చాను. సాయంకాలం 5 గంటలకు ట్రయిను, తిరుపతిలో రేపే పెద్దఊరేగింపును అదిచూచి మాఅక్కయ్యకోర్కె తీర్చాలని బయలుదేరుతున్నాం. నీకోసం చూచీ చూచీ ట్రయిను టయిము అయిపోవడంచేత తిరుపతి బయలుదేరి వెళుతున్నాం. అన్యథా భావించవద్దు.

మీ బావమరది,
రావన్నపంతులు.'

ఉత్తరం చదువుకున్నాడు. కన్నులనిండా నీళ్లుతిరిగాయ్.

"తుమ్మెద రెక్కలవంటి వంకీతల. మంగలి పదును కత్తికి ఆహుతి కావలసిందేనా? ప్రేమతో ముంగురుల సవరించే నాచేయి ఇంక ఆసున్నని గుండు... అబ్బా! ఎలాసవరించడం! వెండ్రుకలులేని ఆపిభూది పండువంటి గుండు నెలా చూడ్డం చూచి ఎలాసహించడం!

స్త్రీ అజ్ఞానిఅయితే వచ్చేచిక్కులేఇవి. భార్యాభర్తలు స్నేహితులనె విషయం తెలియదాయె. భర్త హృదయాను గుణంగా భార్య, భార్య హృదయాను గుణంగాభర్తనడవాలనే సామాన్యవిషయం ఎంతచెప్పినా బోధపడదాయె. ఏమి చెయ్యం! ఎలావేగడం.'

అతనికాలోచనలపై ఆలోచనలు తరుముకొని వస్తున్నాయ్. నిద్రపట్టడంలేదు. అన్నంముట్ట బుద్ధిపుట్టడంలేదు. భార్యను తనమార్గంలోకి తిప్పుకొనలేడు. తాను తనభార్యామార్గంలోకి వెళ్ళలేడు ఎలా?

# 3

రామచంద్రుడు, తనమనసు తనస్వాధీనంలో ఉంచుకోవడం నిమిత్తం భగవద్గీత చదువుకుంటూ ఆనందం అనుభవిస్తూ ఉన్నాడు

అందులో ఒంటెద్దుబండి అతనిగుమ్మంముందు ఆగింది. బండినుంచి దిగాడతని బావమరది రావన్నపంతులు తరువాత నున్నని గుండుమీద సన్ననిముసుగు సవరించుకుంటూ దిగింది నిర్మల.

వారిద్దరినీ చూచాడు. నిలువు నిలువునా నీరైపోయాడు. ఎదురుగా వెళ్ళాడు.

'నిర్మలా! నీవేనా? ఈశక్తిస్వరూపం నీదేనా? శివభక్తురాలవు. నీభూదిరేఖలు అలంకరించుకోపోయావ్. దానితో నీవు చెప్పకుండానే నీభర్త చచ్చాడని అర్థమౌతుంది. భర్తమాట వినని భార్యకు భర్త బ్రతికున్నా చచ్చినట్లే.'

'నేనేం తప్పుచేశానండీ!'

"తప్పా! తప్పన్నారా? భర్త బ్రతికుండగానే ఏమిటీ వెధవముండ ఆకారం. భర్త చచ్చాక తీయించవలసిన తల బ్రతికుండగానే తీయించడం తప్పుకాదూ?'

'మీరిలా అనుకుంటారంటే నేను తీయిస్తానా?'

'ఎలా అనుకుంటా రనుకున్నావ్?'

'నాభక్తికి లొంగిపోయాడతా రనుకున్నాను కాని ఇలా భావిస్తారనుకున్నానా? ఇవాళపోయిన తల రేపురాదూ?

'ఈవాళ ఈశరీరంలోంచి పోయినప్రాణం మళ్ళీ మరొక శరీరంలోకిరాదూ? పోయిందేది రావడంలేదు? పోయిన రుతువులు తిరిగి రావడం లేదూ? ప్రళయానంతరం ప్రపంచం తిరిగి ఉద్భూతం కావడం లేదూ?'

"దానికింత విచారం ఎందుకు?"

'ఏమీలేదు. నాలుగునాళ్ళ నాటకంలో ఈవెధవపాత్ర లేమిటా అని విచారం.'

'గతించినదానికి విచారిస్తే ఏం లాభం?'

'గడవబోయే జీవితంఅయినా పవిత్రంగా ఉంటుంది.'

'ఏదో తెలిసో తెలియకో చేసినపని కింత రాద్ధాంత సిద్ధాంతాలేమిటండీ!"

"ఏమీలేదు. నిగ్రహం చెడి విరాగదయకావండి ప్రసవించే భావపరంపర వినా ఏమీలేదు. నిర్మలా! నీవు మహాభక్తురాలవు; నేను మూర్ఖుడను. నీఇష్టంవచ్చినట్లు నీవుచేశావ్; కాదనడానికి నాకుశక్తి ఎక్కడుంది. మహాత్ములుమీరు; మీ మార్గంలో అడ్డిపోను. జీవితభారం మోయలేక కుంగిపోయే జీవచ్ఛవాన్ని."

ఆమాటలంటూ అతడు కోపంతో లోపలకు వెళ్ళి పోయాడు. ఆకోపంతోటే భగవద్గీత తెరిచాడు.

దానిలో—

శ్లోకం. 'సమదుఃఖ సుఖోధీరం,
సోఽమృతత్వాయ కల్పతే."

అని ఉన్నది. సుఖదుఃఖాలను సమానంగా చూడగలిగిన ధీరుడే ముక్తిని పొందుతాడని ఉన్నది. అంటే సుఖాలకు పొంగి, దుఃఖాలకు క్రుంగేవానికి ముక్తి లేదనే కదూ అర్థం. దానితో అతడు తల తలగడలో కుక్కుకుని బాధంతా లోలోన అనుభవిస్తూఉన్నాడు.

కొంతసేపటికి ముసుగు సవరించుకుంటూ భార్యాసిద్ధమయింది. అతి చనువుగా భర్త మంచంపై కూర్చుంది.

'ఏం నిర్మలా!'

'కోపంవచ్చిందా?"

"పూర్తిగా.'

'ఈ ఒక్క తప్పూ మన్నించలేరూ?'

'నేనెంతవాణ్ణి.'

'భగవంతుని అంతవారు."

'దానికేమిగ్లే నిర్మలా: నీవు నన్ను లెక్కచేయకుండా ఉండాలని చేశావనుకోను. దానివల్ల ఏదోముక్తి వస్తుందని చేశావ్.'

'అంతే. అంతే.'

"శరీర సౌందర్యంపోతే పోయింది. హృదయసౌంద ర్యాన్ని సంపాదించుకుంటేసరి.'

'అదేమిటి ఇదేమిటి? ఇకనుంచిమీరు ఏదిచెబితే అది చేసేయ దలచుకున్నా.'

'ఉహూ.'

"నమ్మండి. ఎందుకంటే—'

'నేను అడుగలేదులే.'

'అడక్కపోయినా చెప్పకుండా ఉండలేను.'

'అయితేచెప్పు.'

'ఎందుకంటే—ఏపూర్వజన్మ కర్మవల్లో ఈజన్మలోభార్యాభ ర్తలం అయ్యాం. చచ్చేవరకూ కలిసిఉండకతప్పదు. అందు చేత మీభావానుగుణంగా నడిస్తే తీరిపోతుంది. ఏకలతలూ కావేషాలూ ఉండవ్.'

"అదేగా నేను ముందునుంచి చెప్పేది?'

"నేను చెప్పడం లేదన్నానా?'

'ఇప్పటికి కుదిరిందన్నమాట తిక్క—'

'కాదుమరి.'

'బలే అసాధ్యురాలవే.'

'అలాగే'

"సరేపోయి పొయ్యిరాజేయ్."

'చిత్రం'

ఆమె నవ్వుతూ లేచివెళ్ళింది. అతని సౌమ్యభావానికి కారణమైన భగవద్గీతకు నమస్కరిస్తూ మళ్ళీ చదవడం ప్రారంభించాలి.

---

## ౪

రామచంద్రుడు ఆఫీసుకు వెళ్ళాడు.

సాయంకాలం మూడు గంటలయింది. నిర్మల తెల్లకోక కట్టుకొని సావిట్లో కూర్చొని చాటలో బియ్యం వేసుకొని బెడ్డలు ఏరుతూంది.

అంతలో ఆమెతో పరిచయంలేనివాళ్ళు, రామచంద్రునితో పనిచేసే సుందరంభార్య శ్యామల బొట్టు చెప్పడానికి వచ్చింది.

లోపలకు వెళ్ళింది.

నిర్మల:—'ఎవరమ్మా మీరు?'

శ్యామల:—'సుందరంగారు తెలీదూ?'

నిర్మల:—'తెలీదే.'

శ్యామల:—'రామచంద్రంగారితో ఆఫీసులో ఎకౌంటెంటుగా పనిచేస్తూఉన్నారు.'

నిర్మల:—ఉహూఁ వారిభార్యాగారా?

శ్యామల:—'చిత్తం. మాతమ్ముడుకూతురుబారసాల రేపు సాయంకాలం మీరంతా తప్పకుండా రండి.'

ఆమాటలంటూ అక్కడగుమ్మానికి కుంకుమ పెట్టి వెళ్లిపోతూ—

శ్యామల:—"మీరెవరో తెలీదు. రామచంద్రింగారి భార్యారాగానే మాయింటికి తాంబూలానికి రమ్మని చెప్పండి' అని వెళ్ళిపోయింది.

నిర్మల నిర్ఘాంతపోయిచూచింది.

శ్యామల:—'ఏం? అలా చూస్తున్నారే?'

నిర్మల:— రామచంద్రుడుగారి భార్యను నేనే కదండీ!'

శ్యామల:—'అయ్యయ్యో! ఎంత పొరబడ్డాం.'

నిర్మల:—'గుమ్మానికి బొట్టు పెడతారే?'

శ్యామల:—'మీకు పెట్టకూడదేమోనని?'

నిర్మల:—"ఏం?"

శ్యామల:—'మాలో విధవలకుగాని తలతీయరు లెండి. మీతల మరెందుకు తీశారో తెలియదుకదండీ, అందుచేత విధవముండ అనుకున్నాం. మన్నించాలి మాఅపరాధం.'

శ్యామల కుంకుమభరణిలో బొట్టుతీసి నిర్మల ఫాలభాగాన్ని పెట్టి సెలవుతీసుకొని బండెక్కి వెళ్ళిపోయింది.

నిర్మల తనగుండు సవరించుకుంటూ—

'ఓరి తిరపతి వేంకటరమణా! ఆరె నీయిల్లు బంగారం కానూ, ఎంతపని చేశావయ్యా! భర్త బ్రతికుండగానే ప్రతివారూ వెధవముండ అనుకొనేటట్లు నా రూపం మార్చేశావు కదా!

నిజంగా నీలో మాహాత్మ్యమేఉంటే నాపోయిన నల్లని తల మళ్ళీ నాకు ఇవ్వరాదూ!

కాళహస్తీమహాత్మ్యంలో రాజు ఒకభోగందానికి తల తీసేస్తే, మళ్ళీ ప్రసాదించావని ధూర్జటిమహాకవి వ్రాస్తాడే, అదేనిజం అయితే నాతలకూడా ప్రసాదించరాదూ?

అటా భర్తకురోత కలిగించాను. ఇటా నలుగురిలో తలఎత్తుకోలేకుండా వెధవముండక్రింద పరిగణింపబడ్డా. నాకింక సుఖం ఎక్కడ? శాంతి ఎక్కడ అంటూ వలవల కన్నీరు మున్నీరుగా ఏడ్వడం ప్రారంభించిందిపాపం!

* * *

సాయంకాలం ఆరుగంటలయింది.

ఆవాడలో చివరింటి సోవమ్మ సత్యనారాయణ వ్రతం చేసుకుంటూఉంటే నిర్మలకూడా వెళ్ళింది.

పూజ అయిపోయింది.

అందరికీ హారతి ఇస్తూఇస్తూ ఈడుకివ్వబోయి కొంత అనవ్యాల కనబరచింది, ఆహారతి ఇచ్చేఅమ్మ.

దానితో నిర్మలకు చాలాబాధ కలిగింది. ముఖం చిట్లించుకుంది. తన ఇంటికి బయలుదేర బోతూఉంటే నలుగురమ్మలక్కలూ ఆమెనుచూచి పక్కుమని నవ్వారు.

అంతేకాదు—

'భర్త బ్రతికుండగానే వెధవముండలా తయారయింది. ఇదేమిఖర్మమో! అంటూ వాళ్లలో వారు గుసగుసలాడారు.

దానితో ఆమెవళ్ళు మండిపోయింది. చేసేదేమీ లేక బిక్కముఖం వేసుకొని, విసవిసలాడుతూ, రుసరుసచూస్తూ ఇంటిముఖం పట్టింది.

'లేదు కరుణలేదు. ఏడుకొండల వెంకటేశ్వరునకు నాపై దయరాదు... ఇలా నలుగురిలో ఈనగుబాటు జీవితం ఎంత కాలం గడపాలో."

సంఘంలోనా మర్యాదలేదు. పతితో ఆనందంలేదు. తలతీసుకొన్న భగవానుడా నన్ను రక్షింపరాడు.

అయినా—మీవారు చెప్పినట్లు భక్తికి స్థానం హృదయంకాని తలవెంద్రుకలు కావుకదా! భక్తిహృదయంలో పుడుతుంది; హృదయంలోనే పరిణతి పొందుతుంది; హృదయాధినాథుడైన ఆభగవానునకే అంకితం అవుతుంది. అంతేగాని భక్తి ప్రపత్తులకు స్థానమైన హృదయాన్ని మేలుకొల్పకుండా కేవలం తలవెంద్రుకలు ఇవ్వడం ఏమిటి?

ఏమిటీ మూర్ఖాచారం! నాశరీర సౌందర్యాన్ని, నాహృదయ మాధుర్యాన్ని, నామనో సౌశీల్యాన్ని, పెరిమింది, పూ

జించే నాపతిదేవుని హృదయ దేవాలయంలోని దైవత్వాన్ని ఆరాధించలేనినేను, ఆ రాతిబండలోని దైవాన్ని ఎలాఆరాధిస్తాను?

ఛీ ఛీ. వేదాలనుంచి నేటి గాంధీమహాత్మునివరకూ, 'పతేదైవం, పతిమాట సతివినాలి' అనిచెబుతుంటే, ఆమాటలు పాటించక, ఆయనహృదయ విఘాతం కలిగించి తిరుపతివెళ్ళ డంఏమిటి? ఇంతకంటే ఘోరం ఏముంది?

స్వామి వివేకానంద చెప్పినట్లు, కదిలేదేవాలయాలైన మానవుంహృదంతరములలో వెలిగే చైతన్యస్వరూపుడైన భగ వానుని ఆరాధించలేక, ఎక్కడో ఏమానవుడో చెక్కిన ఒక విగ్రహంలోఉన్న దేవుని ఆరాధించడానికి వెళ్ళడంఏమిటి?

సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడైన భగవానుడు ఒక చోటఉండి, మరొకచోట లేడనగలమా? అక్కడున్నా భగ వానుడు ఇక్కడలేడా? నాపతిహృదయంలో తాను తనదివ్య సింహాసనాన్ని నిర్మించుకోడా?

అయ్యో! నాపతిని సేవించుకుంటూ, తద్వారా భగ వానుని సేవించుకోరాదా? సీతా, అనసూయా, దమయంతీ, సావిత్రి మొదలగు సాధ్వీమతల్లులు పతిపదసేవవల్లేకదా తరిం చారు. వారిలా నేనెందుకు తరించరాదు.

యదార్థానికి నాపతికంటే నన్నుప్రేమించే దెవరు... ఎలా అబ్బిందో ఈమూఢవిశ్వాసంనాకు, అనుకుంటూ కుమిలి కుమిలి ఏడుస్తూంది.

కొంతసేపయింది—

చీకటి పడుతూవడుతూంది. అంతలో ఆమె సావిట్లో కూర్చుని గడచిన జీవితాన్ని గురించి విచారిస్తూఉంటే, రామచంద్రుని పెదతండ్రికొడుకు సర్వేశ్వరరావు వచ్చాడు.

గుమ్మం ఎక్కిచూచేసరికల్లా నిర్మల ఏడుస్తూఉండడం, ఆమెగుండెమీద కొంగు సవరించుకుంటం చూచాడు.

హడలిపోయాడు.

బ్రాహ్మలలో భర్తపోగానే విధవ తలతీయించడం ఆచారం కాబట్టి, ఆమెభర్త రామచంద్రం పోయాడనుకొని నిలువునిలువునా నీరైపోయాడు. ఆమెను పలకరించడానికికూడా శక్తిలేకుండా అముందుసావిట్లో కుర్చీలో అలాగే కూర్చుని కుమిలిపోయాడు.

కొంతసేపయింతరువాత అన్నను తలుచుకొనేసరికి గుండెలు నీరై, దుఃఖం అపుకోలేక 'ఓఅన్న ఓఅన్నా' నాఅన్న! నాఅన్న' ఎంతపనిచేశావుఅన్నో! నామాటేం చెప్పావుఅన్నో!' అంటూ గుండెలు బాదుకుంటూ ఏడుపు లంకించుకున్నాడు.

ఆఏడుపువిన్న నిర్మల ఆశ్చర్యంతో బయటకు వచ్చేసరికి సర్వేశ్వరరావు ఏడుస్తున్నాడు. ఆమెనుచూచేసరికి దుఃఖం మరింత పొంగిపొర్లిపోయింది.

ఆమెకు భర్తపై అనుమానం అధికంఅయింది. భర్తకేదో ప్రమాదం సంభవించి తీరాలని నిశ్చయించుకుంది.

'ఏమిటిన శ్వేశ్వరావు.'

'ఇం కేముందివదినో! నీగతి ఇలా గౌతుందనుకో లేదు వదినో! వదినా!'

'ఏమిటబ్బాయ్!'

'అన్యాయంగా మనల్ని దగాచేసి వెళ్ళిపోయాడా అన్నయ్య! అన్నయ్యా!'

'ఏం జరిగింది?'

'అన్నయ్యో! అన్నయ్య!'

అతడు గొల్లుమని ఏడ్వడం ప్రారంభించాడు. అకస్మాత్తుగా ఏకారకిందోపడి తనభర్త రామచంద్రం చనిపోయి ఉండవచ్చునని నిర్మల నిశ్చయించుకుంది.

అనలే పాడుమొక్కలు తీర్చడంవల్ల కలిగిన పరాభవానికే క్రుంగిపోతున్న నిర్మలకాతని ఏడుపు గొడ్డలిపెట్టయింది.

అక్కడనుంచీ ఆమెకూడా ఒకమూల ఒరిగిపోయి అతనితోపాటు ఆలాపన ప్రారంభించింది.

'అయ్యో నాదేవుడు, నాదేవుడో, నాదేవుడ. నాగతేం చేసి పోయారో నాదేవుడ ... అకస్మాత్తుగా నన్నువిడిచి పోయారా నాదేవుడ." అని ఆమె ప్రారంభించింది.

'నాఅన్నా! నాఅన్నా!" అని అతడు.—

ఆశోకాలతో ఇరుగుపొరుగమ్మలంతా సిద్ధంఅయ్యారు.

'ఎంతపని జరిగింది?' అంటే 'ఎంతపని జరిగింది' అంటూ వారిచుట్టూ చేరారు.

"ఊరుకో నిర్మలా! ఊరుకో! ఏడిస్తే ఏంలాభం! పోయిన వాళ్ళు తిరిగివస్తారా? ఇంతకూ భూమిమీద నూకల్లేవు' అని కొందరు—"అయ్యో! నిక్షేపంవంటివాడు నిర్యాలం అయిపోయాడు. పండువంటి కుఱ్ఱవాడు ఇట్టే రాలిపోయ్యాడమ్మా!' అని అమ్మలక్కలంతా ఓదార్చడం ప్రారంభించారు.

వాళ్ళు ఓదారుస్తున్న కొలదీ వాళ్ళదుఃఖం చెప్పలేం. మరీగోలపెట్టడం ప్రారంభించారు.

అంతలో ఆఫీసునుంచి రామచంద్రం ఇంటికివచ్చాడు. గుమ్మందగ్గర చేరేసరికి ఏడుపులూ పెడబొబ్బలూ వినపడ్డాయ్. అతడాశ్చర్యపోయాడు. ఆగుమ్మందగ్గర అలాగే రెండునిమిషాలాగిపోయాడు.

అంతలో—

'రామచంద్రం ఎంత ఉత్తముడనుకున్నారు. పాపం మంచి ఆరోగ్యంలోనే ఉన్నాడమ్మా! చూస్తాచూస్తా క్షణంలో చనిపోయాడుకదా! ఇంతకూ వానరాకడ, ప్రాణంపోకడా చెప్పలేం." అని అమ్మలక్కలనుకుంటున్నా మాటలు వినేసరికి నిలువు నిలువునా నీరైపోయాడు.

'నేను చావడమేమిటి? చనిపోతే వీళ్ళెందుకిలా ఏడుస్తారు?...ఒక వేళ చనిపోయానా?...ఏమో!...అయితేఇంకా ఈశరీరం ఉందేమో...చనిపోయి పిశాచాన్నైపోయానా? అర్థంకాదే...ఇదంతాకలా? భ్రమం?' అనుకుంటూ ఆరెండు

నిమిషాలూ అలాగే ఆలోచనల్లో పడిపోయాడు. పాపం! బ్రతి కుండగానే చనిపోయా డనుకుంటున్నా రామచంద్రం.

నెమ్మదిగా లోపలకు వెళ్ళాడు అంతే కొత్తచుట్టం సర్వేశ్వరావు ఎగిరి గంతువేశాడు. గడగడా అలారం కొట్టు కున్నట్లు అతనిగుండెలు కొట్టుకుపోయాయ్. గాలికి అల్లల్లాడే ఆకుల్లాగ శరీరం అంతా గజగజ వణికిపోయింది.

"అమ్మో! దయ్యం! దయ్యం.' అంటూ బిగుసుకు పోతున్నాడు.

'ఏమిటా్రి ఇది?' అన్నాడు రామచంద్రం. దానితో మరింత హడలిపోయి "అన్నయ్య దయ్యం అయివచ్చాడు వొదినా' అంటూ వణుకుతూ ప్రారంభించాడు రాగాలాపన.

రామచంద్రానికి ఏమీ తోచలేదు అలాగే కొయ్య బారిపోయాడు.

'ఎవరిది? ఎవరిది? అయ్యబాబు దెయ్యమేనే–దెయ్యమే' అని కళ్లుమూసుకొని ఒకేఒక పెద్దకేక వేసింది నిర్మల.

అక్కడే అంతా ఆశ్చర్యంతో చూస్తూన్న ఒక కమ్యూనిష్టుకు సంగతి చాలాభాగం అర్థంఅయింది. దెయ్యా లనూ, దేవతలనూ, నమ్మడేమో రామచంద్రం దెయ్యం అయ్యాడని వారంటూఉంటే ఒప్పుకో లేదు. రామచంద్రాన్ని తడిమిచూచాడు. అక్కడనుంచీ పెద్దనవ్వు నవ్వాడు.

కమ్యూనిష్టు:—'అమ్మా! మీభర్త చనిపోయాడని మీ కెవరు చెప్పారు?'

నిర్మల:—"మామరిది సర్వేశ్వరరావేనండి?'

కమ్యూనిష్టు:—"ఏమయ్యా! సర్వేశ్వరరావుగారు! మీ అన్నగారు చనిపోయినట్లు మీ కెవరుచెప్పారండి?'

సర్వేశ్వరరావు:—"నాకు ఎవరుచెప్పారన్నాను?

కమ్యూనిష్టు:—'ఎవరూ చెప్పలేదా?'

సర్వేశ్వరరావు:—'లేదండీ?'

కమ్యూనిష్టు:—"మరి మీ కెలా తెలిసింది?'

సర్వేశ్వరరావు:—'మావదినగారు తలతీయించుకుంటం చేత చనిపోయాడేమో మాఅన్న అనుకున్నా……ఇంతకూ మాఅన్నయ్యచనిపోతే తీయించుకున్నాతల కాదేమిటి?

నిర్మల:—'బాగుబాగు. మీఅన్నయ్య చనిపోతే తీయించుకుంది కాదయ్యాబాబు. ఇది తిరపతిషవరం! ఏడుకొండల వేంకటరమణునికి మొక్కు.'

సర్వేశ్వరరావు:—'అదా! ముడుపులూ, మొక్కుబడులూ?'

నిర్మల:—'ఛి త్తం.'

రామచంద్రం:—'ఇంతకూ అంతాకలిసి బ్రతికిఉండగానే నాశవపూజ చేసేశారు. నేవచ్చింతరువాత నాభార్య

ఎలా గేడుస్తుందో, నాతమ్ముడెలా ఏడుస్తాడో, ఇరుగూ పొరుగు వారెలా అనుకుంటారో ప్రత్యక్షంగా విన్నాను. అంతేకాదు నేను చనిపోతే నాభార్యముఖం ఎలా గుంటుందో కూడా చూచాను... ఇంతకూ మహాభక్తురాలు..." అంటూ రామ చంద్రం కోపంతో లోపలకు వెళ్లిపోయాడు.

కమ్మా:—'మీ మొక్కుబడి ఎంతలోపముంచిందో చూచారా? అమ్మా! భగవానుడు సృష్టికి అలంకారంగా మీకు సౌందర్యాన్ని ఇచ్చాడేకాని, సృష్టిని అసహ్యపరచడానికి మీకీసౌందర్యం ప్రసాదించలేదు. గులాబీపూలు మీతలలో కీలించినప్పుడే వాటిసౌందర్యం; వాటిరేకులు రాల్చి మట్టిలో కలిపినప్పుడు కాదుకదా!

పైగా పతి భగవత్ స్వరూపుడు. పతిసేవకంటే భగవత్ సేవ ఏముంటుందమ్మా! శరీరంలో వ్యాధికి, మొక్కుబడులు తీర్చడానికని ఇచ్చిన తలకు సంబంధంఏముంది?'

నిర్మల:—'ఏమీలేదు—నాబుద్ధితక్కువతప్ప ఇంకేమీ లేదు.' అంటూ లోపలకువెళ్ళింది—ఎక్కడివారక్కడ వింతగా నిర్మల సంగతులూ చెప్పుకుంటూ దేవునికని తలీయించినంత తప్పు మరొకటిలేదనుకున్నారు.



# ౫

మబ్బులు పట్టాయ్; వానకురిసింది.

మబ్బులు విడిపోయాయ్; వాన వెలిసింది.

నాలుగుసంవత్సరాలు గడిచాయి.

నిర్మల తల మెత్తగా నెమలిపింఛంలాగ చక్కగా వస్తూంది. వేజ్ లైన్, కేంథర్ డీ ఆయిల్, అమ్లా హెయిరాయిల్ మొదలైనవన్నీరాసి తలను చక్కగా తయారుచేసుకున్నాడు రామచంద్రం.

అతనికి అందంఅంటే ఆనందం; అందాన్ని ఆరాధన చేయడమే అతని ఆశయం.

" Man is an antist and creator.
He must have beauty and colour."

అని గాంధీజీ అన్నట్లు 'మానవుడు కళాభిజ్ఞుడు; సృష్టికర్త. అతనికి అందచందాలు కావాలి; రంగులు రాగాలు కావాలి."

ఈవిషయాలనే భార్యతో చెబుతూ ఆమెలో అతీత మైనమార్పును తీసుకురాగలిగాడు... అనంతమైన చైతన్యాన్ని తీసుకురాగలిగాడు. దానికిగాను అతని ఆనందాన్ని వర్ణించడానికి వీలులేదు.

నాలుగుసంవత్సరాలు గడిచాయి. ఆసతీపతులు ఆనందంగా ఉంటూఉన్నారు. అంతలో ఆమె తనపుట్టింటికి వెళ్ళి

నాలుగునెలలుఉండి వచ్చింది. అంతే. ఎక్కడనూతనభావా లక్కడే దూదిపింజల్లాగ ఎగిరిపోయాయ్.

ఇంటికి వచ్చింది.

ఇద్దరూ ఆరాత్రి భోజనాలు అయింతరువాత కబుర్లు చెప్పుకుంటూ మేడమీద కూర్చున్నారు. తాంబూలం సేవిస్తూ ఉన్నారు.

మబ్బుమాటునుంచి చందమామ వారిరహస్యజీవనాన్ని తొంగితొంగిచూస్తూఉన్నాడు. పతి సతిముంగురులు సవరిస్తూ ఉన్నాడు.

'నిర్మలా?'

'ఊఁ'

'నీహృదయం ఇప్పుడు నిర్మలంగా ఉందనుకుంటా.'

'ఉండకే.'

"పట్టినమబ్బులు చందమామను ఎంతకాలం దాచగలవు'

'వాటికడుపులో దాచుకొన్న కాస్తకన్నీరూ కార్చే వరకు... ...'

'అంతే అంతే."

'కాని... ...'

'ఏదో గుండెలో బుసకొడుతూంది.'

'ఏమీలేదు కానండీ...మీరన్యథా అనుకోపోతే...'

"అదేవద్దు నిర్మలా! సతీపతులలో అనుమానించుకుంటం శంకించుకుంటం, అన్యథా భావించుకుంటం, ఉండరాదు. ఉంటే వారు సతీపతులుకారు; పిశాచులు; రాక్షసులూను.'

'అలాగే అనుకోండి...మరి...''

"చంపక చెప్పు నిర్మలా?'

'వేరుగా భావించరుకదూ?''

'చెప్పానుగా భావించనని ఇంకా ఎన్నిసార్లు చెప్పను.'

'మరొక్కసారి.'

'అన్యథా భావించను. అన్యథా భావించను అన్యథా భావించను...'

'చాలు. చాలు.''

'ఇంక చెప్పు.'

'ఏమిటంటే—ఈఒక్కవ్రతం చేస్తేచాలు. ఇంక మిమ్మల్ని అడిగితే "ఛీ" అని పిలవండి. ఎంతో కర్చుకాదు.'

'ఏమిటది?'

'సత్యనారాయణ వ్రతం.''

"ఇదొకటా.''

'క్షమించాలి. ఏడుకొండల వెంకటరమణునకిచ్చినట్లు ఏతలా ఇవ్వానవసరంలేదు...''

"సత్యనారాయణస్వామి అపాధ్యుడు. వానిలా ఈయన పనికిరాని తలవెంట్రుకలూ, గోఘ్నా కోరడు, సంచులసంచుల రూపాయిలు కోరతాడు.''

'ఒక్క రూపాయి కట్టుపెడితే నూరు రూపాయిల లాభం ఇస్తాడు.'

'ఎవరికైనా ఇచ్చాడా?'

'ఓ లక్షలాదిగా ప్రజలకిచ్చాడు.'

'నీకెలా తెలుసును?'

'ఎంతమంది చెప్పడంలేదూ?'

'లోకులు కాకులు నిర్మలా! దున్నపోతు ఈనిందంటే దూడను గడ్డివెయ్యమంటారు. అటువంటివారు చెప్పినమాటలు వింటానంటే ఎలా?'

రామతీర్థస్వామిచెప్పినట్లు— నీచెవులతో వినాలి; నీకళ్ళతో చూడాలి; నీమెదడుతో ఊహించాలి. ఎదటివాళ్ళ చెవులతో వినరాదు; ఎదటివాళ్ళ కళ్ళతో చూడరాదు; ఎదటివాళ్ళ బుద్ధితో ఊహించరాదు.

పెరల్ బక్ చెప్పినట్లు:— 'మానవజీవితచరిత్ర ప్రారంభించి ఎన్నోయుగాలు గడిచాయ్. ఏయుగంలోనైనా ఎవ్వరైనా దేవునకు లంచంఇచ్చి తాము కోరిన ఫలాన్ని పొందగలిగినవాళ్ళున్నారా?'

నిర్మలా: భగవానుడు సర్వమయుడు; సర్వవ్యాపకుడు. ఆయన మహాసృష్టిలో మనం పరమాణువులో శతసహస్రాంశం ఉంటాం. అటువంటిమనం ఆ అనంత తేజోమయునకు వ్రతాలు చెయ్యడంఏమిటి? లంచాలు ఇవ్వడం ఏమిటి?

ఒక్కటి చెబుతావిను— నీవునాకు భిన్నంకాదు; మనం భగవానునకు భిన్నులంకాము. మన అజ్ఞానపంజరం మనమే నిర్మించుకుంటున్నాం. మనలను మనమే దానిలో బంధించుకుంటున్నాం. మనలను ఈ తేజో ప్రపంచాన్నుంచి వేరుచేసిన ఆ ఇనుపఊచలను ఛేదించు... అప్పుడు సృష్టికర్తలం మనమే— మనమే భగవంతుని తేజస్సు.

నిర్మలా! సృష్టి అంతా నీఆత్మతేజస్సుతోనే నింపుకున్నావ్ అనుకో. అంతా తేజోమయమే అనుకో. అప్పుడు నీకుగాని వేరే ఒకభగవానుడని నీవుకల్పించిన ఆరూపానికిగాని స్థానం ఎక్కడిది? పూజించేదెవరు? పూజింపబడే దెవరు? అంతా తేజస్సేకదూ? అందు 'నీ' 'నా' భేదాలుంటాయా? 'తర' 'తమ' భావాలుంటాయా? జాతి, కుల, మత విభేదాలుంటాయా? సత్యనారాయణమూర్తి, ఏడుకొండల వెంకటేశ్వరుడనే భేదాలుంటాయా?

నిర్మలా! ఆ ఆత్మజ్ఞానం అవసరం; ఆత్మారాధన అవసరం. అంతేకాని మనిషిచేసిన రాయి రప్పకు మొక్కుతూ మనముంటే రాళ్ళకంటే కనిష్ఠంకామా!"

నిర్మలామాటలన్నీ విన్నది. ఏదోలోపలమార్పు కలుగుతున్నదనుకొని భయపడిపోయింది. తనమనసులోఉన్న సత్యనారాయణమూర్తి దివ్యవిగ్రహం ఎక్కడచెదరిపోతుందో అని గడగడలాడిపోయింది.

"స్వామీ! సత్యనారాయణా! నా భర్త నట్టమూర్ఖుడు — ఈసృష్టినంతా పాలించే దేవుడవు నీవే అని గ్రహించలేని మూఢుడు—నిన్నేదో రాయిగాభావించి, ఎవరో మనుష్యులు చెక్కారంటాడు నీవుసత్యంగా వైకుంఠంనుండి ఈ ఆకారంలో అలాగే దిగివచ్చావని తెలుసుకోలేని అజ్ఞాని... ఆయన అజ్ఞానాన్ని మన్నించి నన్నురక్షించుతండ్రీ! నీవ్రతం తప్పకుండా చేసుకుంటా. నూటొక్కమంది బ్రాహ్మణులకూ తప్పకుండా పంచపరమాన్నములతో భోజనం పెడతాను. నీకై భూ, గో, సువర్ణ, పీతాంబరాదుల దానంచేస్తాను. నాసర్వస్వం నీదే' అంటూ లోలోపల సత్యనారాయణకు మొక్కుకుంది. దానితో గడగడవణికిపోతూంది.

భర్తచూచాడు. ఆమెబాధ గ్రహించాడు. ఆమె అలా బాధపడుతున్నందుకు లోన విచారించకపోలేదు. ఏంచేస్తాడు పాపం! ఆమె హృదయానికి శాంతి చేకూర్చుటకు ఇలా ప్రారంభించాడు.

"నిర్మలా! ఏం అలాఉన్నావ్?"

'ఏంచెప్పనండీ!'

'ఏం?"

"కొంపమునిగిపోయింది."

'ఎందుకు?'

'సత్యనారాయణమూర్తి విగ్రహాన్ని మనుషులు చెక్కారన్నారుకదూ!'

"మరి మనుషులు చెక్కపోతే, దేవతలు చెక్కారా?'

'ఎవరూ చెక్కలేదు."

'మరి ఎలాగుంది?"

'దానంతటఅదే స్వర్గాన్నుంచి వేరుగా భూమిమీదకు దిగివచ్చింది... అలా నవ్వుతారెందుకండీ. నేను చెప్పిందేదో అబద్ధం అయినట్లూ..."

'నిర్మలా! నీమూఢవిశ్వాసానికి నాకు నవ్వువస్తూంది."

'ఊరుకోండి. సత్యనారాయణమూర్తి వింటే ఐటుక్కున శపిస్తాడు.'

'సత్యం చెప్పినందుకే నన్ను శపిస్తే అతడు సత్యనారాయణకాడు; అసత్యనారాయణుడౌతాడు. 'సత్యం' వ్రతంగాగలవాళ్ళకే పూజలన్నీ ఎందుకు?'

"అబ్బా! ఊరుకోండి మీకు పుణ్యంఉంటుంది. పట్టిమొండివాదనే కాని మీకు రెండూ తెలీదు.'

'అవును. నాకు తెలిసిందొక్కటే. అదే సత్యమార్గం.'

'ఏదో ఒకమార్గం. ఉడుదుడుకులుగల ఈక్రొత్తమార్గాలెందుకండీ, ఏకంగా పూర్వులు పోయిన పాతమార్గాలలో పోవాలికాని... ...'

'నిర్మలా! మానవ జీవన యాత్రాసాఫల్యం కొరకు మార్గమే లేని కీకారణ్యాలలో మనపూర్వులు కొన్ని మార్గాలు పరిచారు; మానవకోటిని దానిపై నడిపించారు; మానవులను ముక్తిమంటపానికి చేరిపించారు. ఆదివ్యకృషికి వారికి నానమస్సులు. వారుచేసిన సంఘసేవకు నాకృతజ్ఞతాభివందనాలు... కాని వేదకాలంలో మన మహర్షులు పరచిన మార్గాలలో తీయని ఫలవృక్షాలెన్నో నాటారు. ఆఫలవృక్షాలు వక్కలకూ పాంథులకూ ఆశ్రయం ఇచ్చాయి. సృష్టిఅంతా ఆదివ్య తేజంలో ఆనందరస స్నపితం అయిపోయింది—

కాని నిర్మాలా! ఆప్రేమ పూరితమైన వేదకాలం గతించింది. దానితరువాత స్వార్థభూయిష్టమైన పురాణకాలం, వచ్చింది.

వేదకాలంలోఉన్న ఏకేశ్వరోపాసన గతించింది; దాని స్థానంలో దశావతారాలు కల్పింపబడ్డాయ్. వేదకాలంనాటి సర్వమానవసమత్వం పోయింది; దానిస్థానంలో జాతి కులమత విభేదాలు కల్పింపబడ్డాయ్. మానవులనందరనూ ఒకే కుటుంబంగా తయారుచేసే మతం గతించింది; మానవులలో చీలికలు కల్పించే దురాచారాలు, మూఢవిశ్వాసాలూ బయలుదేరాయ్

దానితో దేశం ముక్కలు ముక్కలయింది. ఐక్యత నశించింది; అభివృద్ధి అంతరించింది; శాంతి అశాంతిలో లీనం అయిపోయింది.

నిర్మలా! స్త్రీ కానాటితో స్వతంత్రం నశించింది. బ్రాహ్మణేతరకాలానాటినుంచి మొన్న మొన్నటివరకూ విద్యాభ్యాసానికి అర్హులుకాకపోవడం ఆకాలనిబంధనలవల్లే ఆపురాణ కాలంవల్లే 44 కోట్ల భారతీయుల్లో 40 కోట్ల భారతీయులు అజ్ఞానులై, పతితులై, నేటికీబానిసలై, దాస్య భిత జీవచ్ఛవాలై నశిస్తున్నారు.

నిర్మలా! ఆపురాణకాలంనాడు కల్పింపబడినవే ఈతిరుపతి వేంకటేశ్వరమహాత్మ్యము! సత్యనారాయణ మహాత్మ్యము! జగన్నాథమహాత్మ్యము—ఇత్యాది వేలకు వేలమహాత్మ్యాలు... తెలిసిందా?

నిర్మలా! గాంధీజీ చెప్పినట్లు సృష్టిలో ప్రతిప్రాణీ భగవానుని అవతారమే. అంతేకాదు ప్రతిగడ్డిపరకా ఆయన అవతారమే. ఆయనదివ్యతేజస్సు ముద్రింపబడని ఒక్క అణువు కూడా ఈప్రపంచంలో లేదు'

'మీరు చెప్పేది ఏదీ నేను కాదనలేను. ప్రతిప్రాణి లోనూ భగవానుని చిద్విలాసమే లాస్యముచేసేటప్పుడు ప్రతి ప్రాణినీ పూజించడం భగవానుని పూజించడమే. కాదనను. కాని ఆశక్తి ఇంకారాలేదు. కాబట్టి ఈపర్యాయానికి నలుగురుపోయే పాతబాటలోనే పోనీయండి.'

'అయితే నామాట విననంటావ్?'

"క్షమించాలి. ఈసారి సత్యనారాయణవ్రతం చెయ్య నియ్యండి.'

'తరువాత జగన్నాథ వ్రతం చేస్తావా?"

"ఇంక చెయ్యనన్నానుకదూ!"

'అనడం అన్నావ్; ఆచరిస్తావనిఎలా?'

'నమ్మమంటున్నాగా.'

'అన్నావ్; ... ... కాని ...'

'ఇక కానీవద్దు; అర్ధణావద్దు; ఈపర్యాయం విందురూ!'

'వినాల్సిందే.'

'తప్పక.'

'ఒక సంచిరూపాయిలు ... ...'

'ఎంతైనా సరే; ఏమికావాల్సింతం.'

'ప్రేమ.'

'ఉహూఁ'

'నిర్మలా! నీవు గీచినగీటు దాటుటనావశమా? ననుగన్న విధాతవశమా? ఆదేమిచిత్రమో లోకంలోభర్త తనసర్వస్వం భార్యాకు ధారవోసినా, భార్యాకు ఎందుకో సంతృప్తి ఉండదు.".

'అదిలోకం విషయం. లోకంమాట మనకెందుకు లెద్దురూ'

"మనమూ టేకావాలంటావా?'

'అంతే.'

'అయితేవద;'

వారిరువురూ ఆనందరసోద్రేకులయ్యారు.

---

# ౬

నిర్మల సత్యనారాయణవ్రతం చేసేరోజది. బంధుమిత్రులు, బ్రాహ్మణులు తండోపతండాలుగా వస్తున్నారు.

నిర్మల హడావుడి చెప్పడానికి వీలులేదు. అటూఇటూ తిరుగుతూంటే, ఇంటిప్రక్క వెంకమ్మ ఇలాగన్నది.

'ఏమా వదినా?'

'ఏం?'

"ఏదో అయిందంటే అయిందని నాలుగు అక్షింతలూ వేసుకుంటారా?"

'ఎన్నటికీ అలాచెయ్యం.'

"మరి?"

'సత్యనారాయణమూర్తి సాక్షాత్తు ప్రత్యక్షంఅయి వర మిచ్చేవరకూ వదిలిపెట్టం. ఎంతకర్చు ఐనాసరే, మాసర్వస్వం పోయినాసరే, అద్భుతంగా చేయదలుచుకున్నాం.'

'మీలా ఎవరూచేయలేదని అనిపించుకో దలచుకున్నా రనుకుంటా.'

'తప్పక.'

'అయితే మాఆయనకు పంచలసాపు, నాకు చీరా రవికా తప్పక దొరుకుతాయన్నమాటే.'

'సందేహం ఏముంది?'

'బాగుబాగు. నాకుకూడా ఏదైనాపని చెప్పరాదూ?'

'పెద్దదానవు చెప్పకూడదుకానీ......వీలుంటే ఒక్క పని.'

"చెప్పూ?"

'ఈపూట నూటొక్కమంది సద్బ్రాహ్మణులకు భోజనం పెట్టాలికదూ?'

'అవునవును.'

'అందుచేత...'

"బ్రాహ్మణులను పిలుచుకురమ్మంటావ్?'

'సద్బ్రాహ్మణులను—'

'ఓ—అందుకు లోటేమిటి? నూరుకాదు; వెయ్యిమందిని తీసుకొస్తా. వెళ్ళిరానా?'

'సంతోషం.'

ఆమె వెళ్ళిపోయింది. నిర్మల తనవనిలో తాను లీనం అయిపోయింది.

ఉదయం పదిగంటలయింది.

పిలుపులకు వెళ్ళినవాళ్ళు తిరిగివచ్చారు. వారిలో ఒక మిత్రుడు రామచంద్రాన్ని కలుసుకున్నాడు.

"ఏమోయ్ చంద్రం! ఆఖరకు ఇలా దిగేవే?"

"ఏం?"

'విజ్ఞానశిఖరంనుంచి ఒక్కసారిలో ఎన్ని మెట్లు దిగిపోయావ్?'

"దిగవలసివస్తే దిగొద్దా?"

'ఏం?'

'అమ్మగారిఆజ్ఞ'

'అయ్యగారు పాలించవలసిందేనా?'

"ఇప్పుడు వారుపాలిస్తే, రేపు మనంపాలిస్తాం."

'బతికేవాడవు; ఆడదిచెప్పినట్లు నడిచేవాడెవడైనా బాగుపడ్డాడా?'

"పూర్వం ఎవడూ బాగుపడలేదు; ఈనాడు నేను బాగుపడతాను."

"అయినా ఆమె మతిపోతేపోయింది; నీకేం కర్మం."

'అర్ధాంగికదూ; దానిమతిపోతే నామతికూడాపోవద్దూ.'

'బలేవాడవులే.'

వారలా మాట్లాడుతూంటే నిర్మలవచ్చింది.

'ఇంకా కూర్చున్నారేం?'

'ఏంచెయ్యమంటారు.'

'చాల్లే లేవండి ఇంకా పదిమంది సద్బ్రాహ్మణులు రావాలి.'

'అలాగే తీసుకువస్తా.'

అతడు లేచి బయలుదేరాడు మిత్రునితో—

'చంద్రం! బ్రాహ్మణులు పనికిరారు; సద్బ్రాహ్మణులు కావాలి. తెలిసిందా?'

'అవునవును.'

'ఎక్కడ తెస్తావ్?'

"అయితే కాఫీహోటల్సులో—లేకపోతే కోర్టుల్లో."

'అక్కడెవరుంటారు?'

'హోటళ్ళలో సర్వర్సు, ప్రొప్రయిటర్సు—కోర్టుల్లో దొంగసాక్షికాలు చెప్పేవారు, ప్లీడర్లు.'

'బలే సద్బ్రాహ్మణులే.'

"కాకపోతే భోజనాలకని పనీపాటలూ మానుకొని ఎవరు వస్తారురా!'

'బాగాచెప్పావ్!'

వాళ్ళిద్దరూ నవ్వుకుంటూ నిర్మల మూఢవిశ్వాసాన్ని గూర్చి చర్చించుకుంటూ బజారుపట్టారు.

* * *

సత్యనారాయణవ్రతం ప్రారంభించారు. రామచంద్రం నిర్మలా పీటలమీద కూర్చున్నారు. వందలాదిగా బ్రాహ్మలు మంత్రాలు చదువుతున్నారు. పూజ జరుగుతూంది—అద్భుతంగా పూజచూస్తూఉంటే నిర్మల హృదయం ఉప్పొంగిపోయింది. ఆమెమనసు ఆనందపరవశం అయిపోయింది. ఆమె శరీరం జలదరించిపోయింది. సాక్షాత్తు సత్యనారాయణమూర్తి ప్రత్యక్షం అయినట్లు అనిపించింది.

పూజాపురస్కారాలు అయ్యాయి. పదిగోవులను దానం చేశారు భూదానం సువర్ణాంబరదానాలు సద్బ్రాహ్మణులను తున్నావాంకి చేశారు.

నిర్మల మెళ్ళో చంద్రహారాలనుంచి, అతడి వాచీవరకూ ఉన్నఆస్తినంతా అమ్మి అతివైభవంగా చేశారు.

నిర్మల బ్రహ్మానందపడింది. నిర్మలకు ఆవిధంగానైనా ఆనందం కలిగించానుకదా అని రామచంద్రం చాలా సంతోషించాడు.

ఆసతీపతులిద్దరూ సత్యనారాయణ వ్రతకారణంగా బ్రహ్మానందం అనుభవించారు.

* * *

వ్రతం పూర్తి అయింది.

అప్పాలు విస్తారం అయ్యాయ్.

సతీపతులిద్దరకూ సంసారం సారవంతగా లేదు; సార రహితమై దుఃఖప్లావితంగా ఉంది.

ఒకరోజు సాయంకాలం ఆసతీపతులిద్దరూ షికారు బయలుదేరి వెళ్లారు.

ఒక కాలవనట్టున పచ్చిక పైకూర్చుని, సంధ్యాకాంతులు కాలవనీటిపై పడుతుంటే చూస్తూ ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు.

అంతలో—

నలుగురు కొన్ని ఆవులను తోలుకొని పోతున్నారు. వాటిలో ఒక ఆవు నిర్మలనుచూచి జాలిగా 'అంబా' అని అరిచింది.

నిర్మల ఆ ఆవునంక చూచింది. కడుపు తరుక్కుపోయేట్లు మళ్ళీ పెద్దగొంతుకుతో "అంబా' అని అరిచింది.

నిర్మల ఆనమాలు కట్టింది. అది వారిదే. వారిప్రాణానికి ప్రాణంగా చూచుకొనేకట్టావు. పొట్టిగా నల్లగా ఎంతో అందంగా ఉండేది. సత్యనారాయణవ్రతం చేసినప్పుడు దానిని ఒక బ్రాహ్మణోత్తమునకు దానంగా ఇచ్చింది. అది పూర్వస్నేహంవల్ల అరుస్తుందేమో అనుకొని లేచింది.

'చూశారా! మనకట్టావు!"

"ఆఁ ఆఁ ఎలాదిక్కిపోయిందో పాపం.'

'అవునవును. ఆ బ్రాహ్మణుడు సరిగా మేపడంలేదు—

"ఇంకా మేపడం ఏమిటి?'

"మేపక—"

"ఎవరుమేపినా మరోగంటసేవు అంతేగా.'

"తరువాత'

'కసాయివానికత్తికి కబేళాలో బలికాబడుతుంది"

'అదేమిటండీ!'

"నిర్మలా! మనం దానంగాఇచ్చిన పదిఆవులలో అయిదు షుమారుగా ఈమందలో ఉన్నాయ్. వీటిపాలు పితుకుకొన్నంత కాలం పిదుకుకొని, ఇవి వట్టిపొయ్యాక ఆ బ్రాహ్మణోత్తములు కసాయివానికి అమ్మివేశారు.'

'ఎందుకు?'

'ఎందుకేమిటి? వానినిచంపి మాసం అమ్మేందుకు.'

'ఏమిటి మన కర్మావును.'

'చంపి, మాంసం అమ్ముతారు.'

'ఆఁ ఆ.'

'నిజం నిర్మలా!'

ఆమాటవినేసరికి ఆమెకు స్మృతి తప్పిపోతున్నట్లయింది. కళ్ళమ్మటనీళ్ళు గిఱ్ఱున తిరిగాయ్.

'నిర్మలా, ఎంతవిస్తే లాభంవేముంది? పాత్రాపాత్రి తెలిసి దానంచెయ్యమని పెద్దలూరకే అనలేదు.'

'తెలిసే బ్రాహ్మణులకు చేశాంకదూ!'

"పిచ్చిదానా! బ్రాహ్మణుడని పిలువబడే ప్రతివ్యక్తీ మహాత్ముడనుకోక. చూడిప్పుడు—ఏమయిందో మనఆవులగతి. పాలుతాగమని దానంచేస్తే, మాంసంఅమ్మి లాభంపొందాలని చూచాడు."

"వాడు బ్రాహ్మడుకాడు; భూలోక రాక్షసుడు."

'కాడని ఎవరన్నారు?'

'మనం భూసువర్ణదానాలుచేశాం; వారూ ఇంతేనా?'

"ఇంతకంటే ఘోరం. కష్టపడకుండా లభించే ఈదానాలను విక్రయించి, ఆడబ్బుతో త్రాగి, వ్యభిచరించి, జూదమాడి, నానా అప్రభ్రష్టపుపనులు చేస్తున్నారు. వారిపాపానికంతకూ మనమే కారణంసుమా!'

'నిజం."

ఆమెకన్నీళ్ళు బలబలా జారిపోతున్నాయ్.

ఆవులు వెళ్ళిపోతూ ఉన్నాయ్.

మళ్ళీ ఆమె కష్టావు 'అంబా! అంబా! అంబా!' అని కన్నబిడ్డ వలవల ఏడ్చినట్లుగా ఏడ్చింది.

దానితో ఆమె హృదయం ముక్కలు ముక్కలైపోయి నట్లయింది.

'అమ్మా! నిన్ను నాపాలతో పెంచానే. నాపాలన్నీ తాగినంతకాలం తాగి ఆఖరకు ఈ కసాయివాని కత్తికి నన్ను బలిచేస్తావా? నీతండ్రి నీకు సేవచేయలేకపోతే కసాయివానికి అమ్మేతున్నావా? నీతల్లి నీదాసీత్వం చేయలేదని విషమిచ్చి చంపుతున్నావా? నేను నీతల్లివంటిదాననుకాదా? "గోమాత" అనే మాటమరచావా?

'నిర్మలా! నన్ను విడిపించి రక్షించవూ' అన్నట్లు నాలు గావులూ నిర్మ్రలవంక జాలిగా చూచాయి. నిర్మల గజగజ వణికిపోయింది భర్తవంక దీనంగా చూచింది.

'ఏం నిర్మలా?"

'వాటిని విడిపించే మార్గంలేదా?'

'కాకే?"

'ఎలా?'

'వాడు కొన్నాధరకొక్క 50 రూపాయలు ఎక్కువిస్తే వదిలేస్తాడు.'

'వాటి నన్నిటినీ ఎంతకిస్తున్నాడో.'

'అడుగుదాంపద.'

వాళ్ళిద్దరూ ఆవులతోటుకుపోయే కసాయివానినాపి వాటిని కొన్నాధర అడిగారు. 500 అని చెప్పాడు.

ఇద్దరూ ఆలోచనలో పడ్డారు

నిర్మలా కసాయివానివంక చూచింది.

'ఏంతల్లీ!'

'నీకు ఎంత ఇస్తే వీటినన్నిటినీ వదిలేస్తావ్?'

"ఆరువందలు ఇప్పించండి.'

'మంచిది. ఇంటికివస్తావా? ఎక్కడైనాఅప్పుచేసి ఇస్తాను'

'చిత్తం. వీల్లేదండి.'

'అట్లైతే ఉండు—'

భర్తముఖం చూచింది. భర్త నీయిష్టంవచ్చినట్లు చెయి మన్నట్లు తల ఊపాడు.

వెంటనే తనచేతిగాజులూ, ఉంగరాలూ, తుదకు మంగళసూత్రపు బంగారుచైనూ అన్నీతీసి ఆకసాయివాని కిచ్చింది.

అత డాశ్చర్యపోయాడు.

'ఇవన్నీ నాకెందుకమ్మా!'

"ఇవన్నీఅమ్మి, నీఅయిదువందలూ తీసుకో. మిగిలితే ఆడబ్బు గోసంరక్షణసమితివారికియ్యి..."

'చిత్తం."

"బాబూ! ఈనల్లావును మాయింటికితోలి, మిగిలిన వాటిని గోసంరక్షణసమితికి తోలివేయ్."

'అమ్మా!'

"ఏం?"

'ఈపాపపుపని చేయకుండా నాకుకూడా ఏదైనా మార్గం చూపరా!'

'తప్పక నాతోరా. నాతమ్మునిలా నాయింట్లోఉండు ఉగ్గా కలో Xంజో అంతా కలిసిత్రాగుదాం. తరువాత పని చూచుకోనచ్చు.'

'చిత్తం తల్లీచిత్తం.'

అతని ఆనందం చెప్పవేం. చంద్రం ఆనందంకూడా వర్ణించలేం.

నిర్మల కత్తావును నిమురుతూ కన్నీరుకార్చింది.

నిర్మలా! ఈనాటికి నీవు నిజమైన భారతనారివి.'

'మీరు చేసిందేగా.'

నీవుకాకపోతే, నేనుచెయ్యగలనా?'

'అంతామీకృప.'

"కాదు భగవానునికృప."

"సత్యనారాయణమూర్తికాదుకదా?"

"పోనీ ఏడుకొండల వెంకటేశునిది."

"బలే. బలే."

అంతా నవ్వుకుంటూ కత్తావుతో ఇంటికి పోగాగ మిగిలిన ఆవులను గోరక్షణసమితికి పంపారు— ఆనాటితో "ముక్కుబడి" అనుభవంలోకి వచ్చింది నిర్మలకు. ప్రజాసేవ తప్ప "ముక్కుబడి" లేదని గ్రహించింది.

సమాప్తి.

Paper Supplied by Party Q. H. E. G. 34.

శ్రీరామప్రెస్, రాజమండ్రి.

శ్రీ జంపనవారి క్రొత్తనవలలు

1 నాదేశం

2 దేవదాసి

3 మొక్కుబడి

4 సేవకురాలు 1 వ భా॥

5 సేవకురాలు 2 వ భా॥

*   *   *

శ్రీ కొవ్వలివారి క్రొత్తనవలలు

1 కాశీయాత్ర

2 కామాంధుడు

3 యముని తీర్పు

4 చెయ్యిజారాక?

5 మిస్. లైలా

6 డబ్బేప్రధానం

7 బస్తీపెళ్ళాం

8 కోతలగాడు

9 కర్మగాడు

---

వలయువారు—

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.